Annual Subscription Rs. 2/-only. Reg. No. M. 2749.

A TELUGU MONTHLY JOURNAL OF INSURANCE BANKING AND FINANCE

# BHEEMA PATRICA

# భీమాపత్రిక

భీమా, బ్యాంకింగు, ఆర్థిక, వ్యవహారములను ప్రచారము చేయు మాసపత్రిక.

EDITOR:
S. KANAKARAJU PANTULU

**PATRONS**

1. K. B. MADHAVA Esq., M. A., A. I. A., (Lond.) F. R. A. S.
CONSULTING ACTUARY
Professor and Head of the Dept. of Mathematical Economics and Statistics,
MYSORE UNIVERSITY, MYSORE.
2. A. KALESWARA RAO PANTULU, Esq., B. A., B. L.,
BEZWADA.



VOL. V BEZWADA—OCTOBER 1936 No. 10

# భీమా పత్రిక

గౌరవపోషకులు

మ. రా. రా. శ్రీ. కె. బి. మాధవగారు, ఎం. ఏ., ఏ. ఐ. ఏ. (లండన్) ఎఫ్. ఆర్.

,, అయ్యదేవర కాళేశ్వరరావు పంతులుగారు, బి. యె., బి. యల్.

సంపాదకుడు: సూరంపూడి కనకరాజు పంతులు.

## భీమా పత్రిక

"భీమాపత్రిక" ప్రతిమాసమున కడపటివారములో ప్రకటింపబడును. జనవరి నెలతో. సంవత్సరము ప్రారంభమై డిశంబరు నెలతో సంవత్సరాంతమగును. సంవత్సరములో నెప్పుడైన చేర్చుకొనబడిన చందాదారులు, వెనుకటి సంచిక లున్నయెడల ఆసంవత్సరములో వెనుకటి సంచికలనుగూడ పొందుట కర్హులు. సంవత్సరపు చందాలు విధిగా ముందు చెల్లింపబడవలెను. వ్యక్తులెప్పుడు చందాదారులుగ చేరి పత్రిక వి. పి. గా పంపుమని కోరెదరో ఆమాస పత్రిక మాత్రము వి. పి. గా పంపబడును. వి. పి. మొత్తము చేరినతరువాత లోగడ పత్రికలు బుక్కుపోస్టుద్వారా పంపబడును. పత్రికలలో ప్రచురింపబడవలసినవిషయము లన్నియు పత్రికాధిపతిగారికి పంపవలెను. మనియార్డర్లు, వ్యాపార సంబంధమైన విచారణలు మేనేజరుగారికి పంపవలెను. వ్యాసముల వాపసుగాని, ప్రత్యుత్తరములనుగాని కోరువారు పోస్టుచార్జీల నతికించి అడ్రసు వ్రాసిన కవరు పంపవలెను. వ్యాసకర్తలు, విలేఖరులు, ప్రచురణములకు పంపు విషయములలోని అభిప్రాయములకు సంపాదకులుగాని, ప్రకాశకులుగాని, ఉత్తరవాదులు కారు. సంవత్సర చందా రు 2—0—0. విడిపత్రిక రు 0—4—0.

వివరములకు:—మేనేజరు, భీమాపత్రిక, బెజవాడ.

### BUSINESS NOTICE.

The "Bheema Patrica" is published in the last week of every month. Subscribers who will not receive the Journal by the 15th of the succeeding month, will kindly communicate to the Manager.

The annual subscription is Rs. 2/- inclusive of postage. Single copy costs 4 annas Subscriptions at whichever time of the year be paid, will cover the period from January to December. All business communications should be addressed to the Manager. Contributions should be sent to the Editor. Articles on matters relating to Insurance are welcome. The Editor is not responsible for the views of the contributors.

For particulars:—The Manager, "Bheema Patrica" Bezwada (S. India).

ఇందులోగల ప్రకటనాదివిషయములకు వ్రాయునపుడు "భీమాపత్రిక" అనుపేరుదాహరింపవలసినదిగ కోరుచున్నాము.

అయ్యా!

శ్రీయుత..............................................................................

గారి సలహా ననుసరించి మీకు యీ పత్రిక పంపించడమైనది. మీరు యీ పత్రికను సాదరాభిమానముతో స్వీకరించి చందాదారుగ చేరి సంవత్సర చందా రు 2/—రెండు రూపాయిలను మనియార్డరుద్వారా పంపించకోరుచున్నాను.

బెజవాడ,
తేది 29—10—36.

మేనేజరు,
భీమా పత్రిక.




# ఆంధ్రదేశ దేశీయ భీమా ఏజంట్ల తృతీయ మహాసభ

## గుంటూరు 3-10-1936

I

సోదరభీమాప్రతినిధులారా? మీకు స్వాగతము! స్వాగతము! స్వాగతము! సంవత్సరము క్రితము విజయవాడపట్టణమున ద్వితీయమహాసభలో కలిసిన తరువాత నేడు గుంటూరుపట్టణమున సమావేశమగుట మిగుల ఆనందదాయకము. ప్రథమమహాసభ 1932 సంవత్సరములో శ్రీయుత కె. బి. మాధవగారిఅధ్యక్షతక్రిందను, ద్వితీయమహాసభ 1935 లో శ్రీయుత జి.యస్. మరాతేగారి అధ్యక్షత క్రిందను సమావేశమయ్యెను. ఇట్టి మహాసభ లుండుటవలననే ఆంధ్రదేశములోగల దేశీయభీమాకంపెనీఏజంట్లందరును కనీసము సంవత్సరమున కొక్కసారియైనను నొక్కచో సమావేశమై తమలోతాము కష్టసుఖములను వెలిబుచ్చుకొని అన్యోన్యప్రీతితో నుండుటకు అవకాశము గలుగుచున్నది.

నేడు మూడవమహాసభ శ్రీయుత డాక్టరు పట్టాభిసీతారామయ్య పంతులుగారిఅధ్యక్షత క్రింద సమావేశమగుచున్నది. వీరిఅధ్యక్షతకాలములో యీమహాసభ ఏజంట్లకు యిప్పటికంటె ఎక్కువ వసతులను కలుగజేయుటకుగాను తగిన తీర్మానములు గావించి వానిని కార్యరూపమున బెట్టి భీమాలోకమునకు తోడ్పడుననుట కెంత మాత్రమును సందేహము లేదు. భీమాప్రతినిధులందరును యిట్టితరుణమున తమఅభిప్రాయములను వెలిబుచ్చి అందులకు తగిన తీర్మానములను గావించి కంపెనీలవారికి వెంటనే తెలియపరచుట అత్యుత్తమము. భీమాచట్టసవరణలను గూర్చి విచారించుటకు ప్రభుత్వమువారు ఒక యక్స్‌పర్ట్ కమిటీ(Expert committee)ని ఏర్పరచి కంపెనీలసంఘముతరఫున శ్రీయుత పండిత సంతానంగారిని ఆసంఘములో సభ్యులుగా ఏర్పాటు చేసియున్నారు.

భీమావ్యాపారమునకు ముఖ్యకారకులగు ఏజంట్లకష్టసుఖములనుగూర్చి ఎవరును యోచించుచున్నట్లు లేదు. కంపెనీలవారు "మా కాయుష్యం, మా కారోగ్యం" అనునట్లు ప్రవర్తించుచున్నారు. అట్లు కానియెడల ఏజంట్లతరఫున గూడ మాట్లాడుటకు ఆసంఘములో ఒకఏజంటుప్రతినిధినిగూడ సభ్యునిగా ఏర్పాటుచేసియేయుందురు. ఏజంట్లు స్వశక్తిపై ఆధారపడి తమ తరఫున గూడ ఒకప్రతినిధిని ఆ సంఘములో ఒకసభ్యునిగా చేర్పవలసిన దని ప్రభుత్వము

వారిని కోరుచు యీ మహాసభలో ఒక తీర్మానమును గావించి ప్రభుత్వము వారికి తెల్పుట యిట్టితరుణమున ముఖ్యావసరము. ఈ తరుణమును బోగొట్టుకొనక ప్రతినిధు లందరును ఏకాభిప్రాయముతో ఇందులకు తగిన గట్టి ప్రయత్నములను చేయుదురని నమ్ముచున్నాము.

## II

# గుంటూరు భీమాసభలు

1936 సం॥ అక్టోబరు, 3, 4.

ఆహ్వాన సంఘాధ్యక్షులు
శ్రీయుత వి. వి. పి. సుబ్రహ్మణ్యం
బి. ఏ, బి. యల్., గారి
ఉపన్యాస సారాంశములు.

శ్రీయుత సుబ్రహ్మణ్యము గారు అధ్యక్షులకును, ప్రతినిధులకును తదితర అతిధులకును సగౌరవముగ ఆహ్వాన మిచ్చుచు గుంటూరు పట్టణపు పురాతనచరిత్రను తెల్పుచు మహాసభకు అధ్యక్షులగు శ్రీయుత డాక్టరు పట్టాభిగారి యొక్క దేశ సేవను కొనియాడుచు కృష్ణాపత్రిక, జన్మభూమి, బందరునేషనల్ కాలేజి, కృష్ణాకో-ఆపరేటివ్ బ్యాంకు, ఆంధ్ర బ్యాంకు, భారత లక్ష్మిబ్యాంకు, ఆంధ్ర యిన్సూరెన్సు కంపెనీ, హిందూస్తాన్ మ్యూచుయల్ యిన్సూరెన్సుకంపెనీ సంస్థలస్థాపకులు మూలకారకులగు శ్రీయుత పట్టాభి గారివంటి సుహాసహుడు ఈమహాసభకు అగ్రాసనాధిపతిగానుండి కార్యక్రమము నడుపుట చాల అదృష్టమనియు వీరి అగ్రాసనాధిపత్యమున ఈ మహాసభ ప్రస్తుతము ఏజంట్లకుగల కష్టములను తొలగించి ఏజంట్లకు ఇప్పటికంటె సౌకర్యములగు వసతులను చేకూర్చునట్టి తీర్మానములను చేసి వాటిని ఆచరణయందుబెట్టు సమర్థతతో నుండునని ఆశించుచున్నామని వినగించియుండిరి.

శ్రీయుత సుబ్రహ్మణ్యముగారు తమ ఉపన్యాసములో జీవితభీమాయొక్క లాభములను భీమా వ్యాపారము దేశమునకు ఏవిధముగా ఉపకారము చేయుచున్నదియు, ఏజంట్లలో సంఘీభావావశ్యకతయు, ఏజంట్లవిధులను, ఏజంట్లలోగల లోపములను, వాటిని సవరించుకొను విధానములను, ఆంధ్ర దేశ దేశీయ భీమా ఏజెంట్ల సంఘావశ్యకతయు, ఈ సంఘమునకు భీమాపత్రికాధిపతులగు శ్రీయుత సూరంపూడి కనకరాజు పంతులుగారు చేయుచున్న సేవయు, కంపెనీల వారు రెన్యూయల్ కమీషన్, ఏజెన్సి కంట్రాక్టు పరతులలో ఏజెంట్లకు చేయవలసిన సౌకర్యములనుగూర్చియు, దేశభాషలలోను, యింగ్లీషుభాషలోను గలభీమాపత్రికలు (Insurance journals) చేయుచున్న ప్రచారములను, చేయవలసిన ప్రచారవిధానములను పట్టాదారులు జబ్బుపడిన కాలములో కంపెనీలవారు వారికి చేయవలసిన వైద్యసహాయమునుగూర్చియు ఇండియన్ లైఫ్ ఆఫీసెస్ అసోసియేషన్ చేయుచున్న పనియు, పట్టాదారయొక్కయు, ఏజెంట్లయొక్కయు క్షేమమును దృష్టిలోనుంచికొని ఆసంఘము చేయవలసిన విధానములను, భీమాచట్టసవరణలో స్వదేశీ విదేశీ కంపెనీలలో నున్న పక్షపాతములను తొలగించు విధానములను ఏజంట్లకుయిచ్చు మొదటి సంవత్సరపు కమీషను ఏర్పాటును షేరుహోల్డరులకు తమ షేర్లపై ఫిక్సెడ్ రేటు ఆఫ్ డివిడెండును యిచ్చుట మొదలైన అవుసరములగు సవరణలను గూర్చియు మహోపన్యాసమును గావించిరి.

శ్రీ సుబ్రహ్మణ్యంగారి స్వాగతోపన్యాసములోని విషయములు చాలసమంజసముగనున్నవి.

ఏజంట్లకు ప్రస్తుతపరిస్థితులలో గల యిబ్బందులను తొలగించి వారికిచేయవలసిన వసతులను గూర్చి చక్కగ వివరించిరి. ఏజంట్ల కోర్కెలు గొంతెమ్మకోర్కెలు కావు. అవి అందుబాటులో నున్నవియే. కంపెనీలవారు ఏజంట్లక్షేమమే తమ క్షేమమని యాలోచించి చేయదలచుకొనిన వెంటనే తగుసౌకర్యములను చేయవచ్చును. ఏజంట్లకు తగు సౌకర్యములను చేయుటయా లేక చేయక పోవుటయా అనునదియే ఒక ప్రశ్న. కంపెనీలవారు దూరదృష్టితో శ్రీయుత సుబ్రహ్మణ్యంగారి ఆహ్వాన ఉపన్యాసములోని విషయములను దృష్టియం దిడుకొని అనతికాలములో ఏజంట్లకు తగు సౌకర్యములను ఒనగూర్చెదరని నమ్ముచున్నాము.

## III

## శ్రీయుత డాక్టరు పట్టాభి సీతారామయ్యగారి అధ్యక్షోపన్యాసము

### (President's Speech)

శ్రీయుత పట్టాభిగారు తమ అధ్యక్షోపన్యాసమును క్రౌను ¼ సైజులో 8½ పేజీలలో యింగ్లీషుభాషలో నిమిడ్చియుండిరి. హిందూదేశములోగల భీమాకంపెనీలవారికేగాక భీమా ప్రపంచ మంతటికిని తెలియుటకుగాను తమ అధ్యక్షోపన్యాసమును ఇంగ్లీషుభాషలో వ్రాయవలసినదని కోరగా అట్లు చేసియుండిరి. అధ్యక్షోపన్యాసము ఇంగ్లీషులో నున్నప్పటికి శ్రీయుత పట్టాభిగారు మాతృభాషలో ఆవ్యాసములోగల విషయముల నన్నిటినిగూర్చి విపులముగ దెల్పియుండిరి. శ్రీయుత పట్టాభిగారి మహోపన్యాససారాంశములు:—

భీమా నిత్యజీవితయాత్రలోను విద్యాభ్యాసముగ జేసుకొను విషయములోను నిర్లక్ష్యము చేయబడిన ఒకశాఖగనున్నది. నిర్లక్ష్యముతో చూడబడుటయేగాక ఎక్కువగా నిరసింపబడెను. డాక్టర్లలోగాని, లాయర్లలోగాని, యింజనీర్లలోగాని, ఉపాధ్యాయులలోగాని, ప్రభుత్వోద్యోగులలోగాని తమ జీవితములను భీమా చేసుకొనకుండా యుండని వారులేరు. కాని తమబిడ్డలకుజీవితములో యీ వ్యాపారము వృత్తిగా ఏర్పాటు చేయుమని చెప్పినప్పుడు యీసడింపుభావము గలిగి నిర్లక్ష్యముతో నుందురు. కళాశాలవిద్యార్థులకు సైతము భీమావృత్తి నవలంబించు విషయమును గూర్చి ముచ్చటించినప్పుడు వారు కూడ నిరసనభావముతోనే చూచుచుందురు. పాపము వారు యీ భీమా ప్రజాసామాన్యమునకు ఎట్టి మహోపకారమును జేయునో, యీ వృత్తినవలంబించుటవలన గలుగు లాభము లెవ్వియో తెలుసుకొనజాలకున్నారు. దేశసౌభాగ్యసంపదకు కార్మిక సమస్య, రైతుసమస్య, బ్యాంకింగు భీమా సమస్యలు ప్రధానవిషయములుగ పరిగణింపబడుచున్నవి. ప్రజాహితజీవమునకు ప్రధానమగు రైల్లు, ఓడలు, ఖనిజపరిశ్రమలు మొదలగు వ్యాపారములు లాభములకొరకు ఆశించువ్యక్తుల స్వాధీనములో నుండక స్టేటు కంట్రోలు క్రింద నుండుట అవసరమని కరాచి సెషన్సు కాంగ్రెసువారు చేసిన తీర్మానమునుబట్టి యీ భీమావ్యాపారప్రాధాన్యతను తెలుసుకొనవచ్చును. ఈ భీమావ్యాపారము ఒకవ్యక్తికి గాని ఒక ప్రత్యేకసంస్థకుగాని సంబంధించినది కాదు. హిందూదేశమున కంతటికిని సంబంధించిన సమస్య. భీమా పరస్పరసహాకారరక్షక సంస్థ. ప్రస్తుతకాలమానమునుబట్టి ప్రతివారికిని భీమా చాల అత్యవసరమై యున్నది. ఈ విషయ

ములో హిందూదేశము చాల అభివృద్ధిని చూపి నది. ఇతర దేశములతో పోల్చి చూచిన యీ అభివృద్ధి చాలదు.

ఈ వ్యాపారమును వృద్ధిచేయుటకు యీ మధ్య చాల భీమాసభలు జరుగుచున్నవి. ఈ వ్యాపారమునకు, షేరుహోల్డర్లు, ఏజంట్లు, పట్టాదార్లు, ప్రిధానులు. ఈ వ్యాపారమంతయు వీరి పైననే ఆధారపడియున్నది. వీరు ముగ్గురును లేనిదే యీవ్యాపారము లేదనియే చెప్పవచ్చును. ఏజంట్లసభలు, షేరుహోల్డర్లసభలు, పట్టాదార్ల సభలు అనే వేరువేరుసభలకంటె పరస్పరసహకారముతో గూడిన ఈ వ్యాపారాభివద్ధి ముగ్గురును కలిసియున్నట్టి (Composite Gathering) మహాసభయుండుట చాల శ్రేయస్కరము. గృహవైద్యుడు, ఇంటిపురోహితుడు లాయరు మొదలగువారు ఎట్లులో అట్లే భీమాఏజంట్లు గూడ గృహయజమానునియొక్క భీమాసలహాదారులుగ నుండు అలవాటు చేయవలసియున్నది. అట్లున్నప్పుడే ప్రజలలో భీమావ్యాపారము చాల విరివిగా వ్యాపింపగలదు. ఈ వ్యాపారమునకు ఏజంట్లు ప్రిధానులగుటచే వీరికికూడ కంపెనీలపరిపాలనసంఘములో బాధ్యతాయుతస్థానములను యివ్వవలసిన తప్పని అవుసరము గలదు. ఏజంటుకు అట్టి స్థానము నొసంగినప్పుడు కంపెనీల వ్యాపారము ఇప్పటికంటె అనేకరెట్లు వృద్ధిపొందు ననుటకు సందేహములేదు. విశేషలాభములను తినవలెననెడి ఆశతో ప్రారంభములో కొద్ది మూలధనమును పెట్టుబడి చేసి వ్యాపారమును సాగించిన షేరు హోల్డరులతో నిమిత్తములేదు. వారు తిను లాభములకు అంతులేదు. రిజర్వు బ్యాంకువంటి బ్యాంకుకూడ సంవత్సరము 1 కి నూటికి రు 5/లు కంటె ఎక్కువ డివిడెండు యివ్వబడదని నియమించియున్నది. ఏజంట్లు, పట్టాదార్లు మాత్రమే ఉన్నకంపెనీలలో అట్టిభయము లేదు. ఏజంటువృత్తి చాల జవాబుదారిగల పని. ఎక్కువబాధ్యతతో నిర్వహింపవలసియున్నది. తనయందును తాను ఏజంటుగా పనిచేయుచున్న కంపెనీయందును ప్రజలకు ఎక్కువనమ్మకము గలుగజేయవలెను. తాను సంపాదించిన వ్యాపారము కాలదోషము పట్టకుండను నూతనవ్యాపారము ఒడుదుడుకు లేక సక్రమముగా వచ్చునట్లును చూచుకొనుచుండ వలెను. పల్లపువ్యవసాయములో వ్యవసాయదారునిపని ఎట్లుండునో అనేవిధముగ ఏజంటుపనికూడ యుండును. ప్రారంభములో పని ఎక్కువ. లబ్ధితక్కువ. చివరకాలములో ఎక్కువలబ్ధి కలుగుననుటకు సందేహములేదు. గవర్నమెంటు ఉద్యోగములలో చివరదినములలో పింఛను పుచ్చుకొని సుఖపడవచ్చునని ఎటుల యాసితురో అదేవిధముగ ఒకప్పుడు అంతకంటె సుఖమును యీవృత్తిలో పొంద వచ్చును. అన్నివృత్తులలోకెల్ల ఏజంటువృత్తి సర్వోత్కృష్టమైనదని తెల్పుచు కంపెనీలవారు ఏజంట్లకు మొదటిసంవత్సరము రెన్యూయల్ కమీషన్ విషయములలో చేయవలసినసౌకర్యములను ఏజంట్లు తమ బాధ్యతలను గుర్తెరింగి నిర్వర్తింపవలసిన విధులను భీమావ్యాపారము దేశసౌభాగ్యసంపదకు ఏవిధముగా తోడ్పడునదియు యీ వ్యాపారమును, దేశములలో చిరస్థాయిగనుండునట్లు చేయు విధానములను, ఈ వ్యాపారమునుగూర్చి బోధించు విద్యాసంస్థనేర్పాటుచేయుటనుగూర్చి మొదలైనవిషయములనుదెల్పుచు పట్టాభిగారు తమగంభీరోపన్యాసమును ముగించిరి

శ్రీ పట్టాభిగారి అధ్యక్షోపన్యాసములోని విషయములు హిందూదేశములోనున్న భీమా

కంపెనీలవారున్నూ, ఏజంట్లును, పట్టాదారులే గాక ముఖ్యముగ భీమాలోక మంతయు గమనించి ఆచరణయందు పెట్టదగినవై యున్నవి. వీరి ఉపన్యాసములోని విషయము లన్నియు మిక్కిలి దూరదృష్టితో యోచించి చెప్పినవిషయములే! కంపెనీలవారందరును శ్రీపట్టాభిగారి ఉపన్యాససారాంశములను గమనించి తమకును, పట్టాదారులకును, ఏజంట్లకును ప్రయోజనముండునట్లు తగుఏర్పాటులను చేసి హిందూదేశ భీమావ్యాపారాభివృద్ధికి మిగుల తోడ్పడెదరని నమ్ముచున్నాము.



# IV
# మహాసభ తీర్మానములు

తృతీయఆంధ్రదేశదేశీయ భీమాఏజంట్ల మహాసభ వారు 1936 సం॥రం అక్టోబరు 3,4 తేదీలలో గుంటూరుపురమున శ్రీయుత డాక్టరు భోగరాజు పట్టాభి సీతారామయ్యపంతులుగారి అధ్యక్షతక్రింద సమావేశమై పదునెన్మిది తీర్మానములను గావించియుండిరి. వానిలో 3, 5, 7, 10, 12 (a), 16, 17, చాల ప్రధానములైనవి.

3 వ తీర్మానము:— ఇతరరాష్ట్రములలో స్థాపింపబడి, ఆంధ్రదేశములో బ్రాంచి ఆఫీసులను బెట్టి పనిచేయుచున్న కంపెనీలు సదరుబ్రాంచి ఆఫీసులకు ఆంధ్రులనే బ్రాంచి యజమానులుగా నుండునట్లు యేర్పాటు చేయవలసినదిగా యీ సభవారు తీర్మానించియున్నారు. ఈ తీర్మానమెంతయు మిక్కిలి సహేతుకముగను, సమంజసముగను యున్నది. ప్రతిరాష్ట్రీయబ్రాంచిఆఫీసులకును ఆ యా రాష్ట్రభాషల నెరింగిన వారినే బ్రాంచి యజమానులుగా చేయుటవలన కంపెనీలవ్యాపారము యిప్పటికంటె అనేకరెట్లు వృద్ధియగు ననుటకు సందేహములేదు. దేశభాష నెరింగినట్టియు, స్థానికులుగానున్నట్టియు, ప్రజలంకరితోనూ, కలసిమెలసి తిరుగు రాష్ట్రీయులనే బ్రాంచియజమానులుగా పెట్టుటవలన, కంపెనీలవ్యాపారము మరింత వృద్ధియై పట్టాదారులకును ఏజంట్లకును అన్యోన్యత యేర్పడి దేశములో భీమావ్యాపారప్రచారము యిప్పటికంటె యెక్కువయగుటకు యెక్కువ అవకాశము గలదు. ఈవిషయమును కంపెనీలవారందరును గమనించి ఆచరణయందు పెట్టెదరని నమ్ముచున్నాము ఈ విషయములో ఓరియంటల్, ఏషియాన్, నేషనల్ ఇండియన్ కంపెనీలవారు అవలంబించినవిధానమును గూర్చి వారిని మేమెంతయు నభినందించుచున్నాము.

5 వ-తీర్మానము:—ఏజెన్సీ కావలెనని కోరినప్పుడు, కంపెనీలవారు యేజెంట్లపై విధించు షరతులను ఏజెంట్ల స్వతస్సిద్ధహక్కులకు భంగకరముగానుండు విషమ షరతులును, కంపెనీలకు అనుకూలముగా నుండు రీతినే కంపెనీలవారే తరుచు తయారుచేసి, యేజెంట్లను ఆకాంట్రాక్టులపై సంతకములను పెట్టవలసినదిగా కోరుచుందురు. క్రొత్తగా యేజెన్సీ తీసుకున్న ఏజెం

ట్లకు, తమకు సౌకర్యములను గలుగజేయు షరతులు యెట్టివియో తెలియకుండుట అరుదు కాదు. కంపెనీలవారు ఏజెంట్లకు యెట్టి సౌకర్యములను కలుగజేసి, ఏషరతులను విధించవలెనో ఏజెంట్లు కంపెనీలయెడ ఏరీతిని నడచుకొనవలెనో, ఆవిధానములను తెల్పు ఒక ఆదర్శ ఖరారునామా తయారుజేసి ఏజెంట్లకును, కంపెనీలవారికిని, దానిలోని విషయములను తెల్పుట అత్యావసరమైయున్నది. ఈవిషయములో సభవారు ఏకాభిప్రాయమునకువచ్చి ఒక ఆదర్శ ఖరారునామాను తయారు చేయుటకు నలుగురు సభ్యులతో కూడిన ఒక ఉపసంఘమును ఏర్పరచియున్నారు. ఇట్లు చేయుట చాల సమంజసము. సదరు ఉపసంఘము వారు వెంటనే సమావేశమై ఒక Model agency contract ను తయారుచేసి ఏజంట్లసంస్థాయి సంఘకార్యనిర్వాహకవర్గము వారి అమోదమునకు పంపించెదరని నమ్ముచున్నాము.

7 వ తీర్మానము:—రాబోవు ఇన్సూరెన్సు చట్టసవరణ ఏర్పాట్లలో ఏజంట్లయొక్కయు పట్టాదారుల యొక్కయు హక్కులు ఏరీతిగా ఆ చట్టమునందుండవలెనో చర్చించి వారి పరి వ్యవసానమును ఇండియా ప్రభుత్వము వారికి తెలుపుటకు నూ అవసరమైనచో డిప్యూటేషనుకు వెళ్లుటకును 5 గురుతో గూడిన ఒక ఉపసంఘమును యేర్పాటు చేసియున్నారు. ఈఉపసంఘము వారు తమ పనిని వెంటనే నిర్వర్తించెదరని నమ్ముచున్నాము.

10 వ తీర్మానము:—ఈతీర్మానము చాల ప్రధానమైనది. కంపెనీలకును ఏజంట్లకును ఏజన్సీ కాలములో మధ్య యెప్పుడైనను తగాయిదాలు రావని చెప్పుటకు వీలులేదు. తగాయిదాలు వచ్చిన సందర్భములో కంపెనీలవారు అర్థికముగ బలవంతులై పట్టాదారులతో స్వలాభాపేక్షాపరులై ఎంతదూరమైనను పోరాడుటకు శక్తి కలిగి యుందురు.

కాని ఏజంటులు అట్టి శక్తిసామర్థ్యములు లేనివారై, తమదీనస్థితినుగూర్చి చింతిల్లుచుండును గాని, కంపెనీవారితో పోట్లాడుటకు అర్థికముగ యెంతమాత్రమును అవకాశము లేనివారై యుందురు. ఇట్టి సందర్భములో కంపెనీలకును, ఏజంట్లకును, మధ్య మధ్య సంభవించు సివిల్ తగాయిదాలను, మధ్యవర్తిత్వ పరిష్కారమునకు విధిగా లోబడి యుండునట్లు ప్రతికంపెనీవారు వెంటనే తమ ఏజన్సీపత్రములలో, ఒక షరతుగా జేర్చుట అవసరమైయున్నది. కంపెనీలవారు, యీ మహాసభవారి తీర్మానమును గమనించి సాధ్యమైనంత త్వరలో యీవిషయమును అమలులోనికి దెచ్చెదరని నమ్ముచున్నాము.

12 వ (ఆ) తీర్మానము:—శ్రీమా వ్యాపారాభివృద్ధికి ఏజంట్లును, పట్టాదారులును ప్రధానులు. అట్టి సందర్భములలో ఏజంట్ల యొక్కయు, కంపెనీలయొక్కయు, పట్టాదారుల యొక్కయు, క్షేమాభివృద్ధులు యోచించి ప్రొప్రయిటరీ కంపెనీలపాలకవర్గములో ఏజంట్లకు మూడవ వంతు స్థానము మ్యూచువల్ కంపెనీలలో 2/5 వ వంతు స్థానమును ప్రత్యేకించి యుండుట చాలాఅవసరమై యున్నది. ఈవిషయము కొన్ని కంపెనీలవారు గుర్తించి తమపాలకవర్గములలో ఏజంట్లకు సంతృప్తికరమైన నియోజకస్థానములనుకల్పించి యున్నారు. హిందూదేశములోగల మిగిలిన అన్ని కంపెనీలవారును తమపాలకవర్గములలో ఏజంట్లకు తగినన్ని స్థానములను సాధ్యమైనంత త్వరలో యేర్పాటు చేసెదరని నమ్ముచున్నాము.

16 వ తీర్మానము:—కొన్ని కంపెనీలు ఏజంట్లకు క్లయిము మొత్తములో మినహాయించుకొను 1 st year Renewal ప్రీమియముల పై కమీషను యిచ్చుట లేదు. అదియును గాక Nonforfeiture పద్ధతిక్రింద అడ్వాన్సు చేసిన ప్రీమియముపై కూడ రెన్యూయల్ కమీషను యిచ్చుటలేదు. ఇది కేవలము అన్యాయము. ఇంతటినుంచియైనను, యీ మ హా స భ వా రి కోర్కె ననుసరించి పైనుదహరించిన ప్రీమియముల పై గూడ కంపెనీలవారు యేజంట్లకు కమీషను యిప్పించే యేర్పాటు చేయుదురని తలంచుచున్నాము.

17 వ తీర్మానము:— ఆంధ్రదేశములో భీమావ్యాపారమునందు విద్యార్థులను తయారు చేయుటకు రాజమహేంద్రవరములో శ్రీయుత శనివారపు సుబ్బారావుగారిచే నెలకొల్పబడిన ఆంధ్రకాలేజి ఆఫ్ కామర్సు అను సంస్థ ఒక్కటియే యున్నది. ఈ సంస్థలో భీమాశాఖను వృద్ధిచేయుటకు తగు ధనసహాయము కావలసి యున్నది. అట్టిసహాయము చేయుటకు భీమాకంపెనీలవారు పూనుకొనవలెను. ఈసంస్థకు తగు ధనసహాయము చేసినచో యిందు భీమావ్యాపారనిపుణతగలిగినవిద్యార్థులను తయారుచేసి అట్టివిద్యార్థులను భీమావ్యాపారప్రచారమునకు బయిటికిపంపుటకు వీలగును. కావున హిందూదేశములో గల భీమాకంపెనీలవా రందరును తమశక్తికొలది ధనసహాయ మొనర్చి, యీసంస్థను పోషించెదరని నమ్ముచున్నాము.

---

# మా వం ద న ము లు

1936 సం॥ అక్టోబరు 3,4 తేదీలలో గుంటూరులో జరిగిన తృతీయ ఆంధ్రదేశ దేశీయ భీమాఏజంట్ల మహాసభ సందర్భమున ఈ మా ప్రత్యేకసంచికను వెలువరించుటలో తోడ్పడిన వ్యాసకర్తలగు ఆంధ్రపత్రిక వారికిని, శ్రీయుత మల్లెల శ్రీరామమూర్తిగారికిని, శ్రీయుత శనివారపు సుబ్బారావుగారికిని, శ్రీయుత చెరుకువాడ వెంకటనరశింహంగారికిని, మద్రాసు **Peace Guardian** వారికిని, **Bombay Business Friend** వారికిని, ఆంధ్రదేశదేశీయ భీమా ఏజంట్లసంఘమువారికిని మా కృతజ్ఞతాపూర్వక వందనముల నర్పించుచున్నాము.

ఈపత్రిక స్థాపన ప్రారంభమునుండియు ఎడతెగక ప్రతినెలయు భీమావ్యాసములను వ్రాసి ప్రకటన నిమిత్తము మాకు పంపుచు, మమ్ములను మిగుల ప్రోత్సాహపరచి మా ఉద్యమమునకు మిగుల తోడ్పడుచున్న శ్రీయుత శనివారపు సుబ్బారావుగారికి మరియొకమారు మా ప్రత్యేక నమస్కృతులొనర్చుచున్నాము.

బ్లాకులు సప్లై చేసిన కృష్ణాపత్రికవారికిని, భీమాప్రచారిణివారికిని గూడ మావందనముల నర్పించుచున్నాము.

# ద్వితీయ ఆంధ్ర దేశ దేశీయ భీమాపట్టాదారుల మహాసభ

## 1936 సం॥ గుంటూరు

ద్వితీయ ఆంధ్రదేశ దేశీయ భీమాపట్టాదార్ల మహాసభ 1936 సం॥ అక్టోబరు 4 వ తేదీని సాయంత్రం 3 గం॥లకు గుంటూరు పురమున ఏషియన్ అస్యూరెన్సుకంపెనీవారి బ్రాంచి ఆఫీసు ఆవరణలో, సౌత్ ఇండియాకోఆపరేటివు ఇన్సూరెన్సు సొసైటీలిమిటెడు అధ్యక్షులును, దేశసేవాప్రియులునగు శ్రీయుత వేమవరపు రామదాసు పంతులు, బి. ఎ. బి. యల్. గారి ఆధిపత్యమున సమావేశమయ్యెను. వివిధ కంపెనీల పట్టాదారులు పలువురు యీ మహాసభకు విచ్చేసియుండిరి.

ఆహ్వానసంఘము తరఫున, ప్రతినిధుల తరఫున శ్రీయుత, ఉప్పలూరి లక్ష్మీనరసింహారావు పంతులుగారు అధ్యక్షులకు స్వాగత మొసంగిరి.

భీమాపత్రికా సంపాదకులగు శ్రీయుత సూరంపూడి కనకరాజుపంతులుగారు రెండు సంవత్సరముల క్రిందట ఆంధ్రదేశములో స్థాపింపబడిన ఈ భీమాపట్టాదార్ల సంఘచరిత్రను జెప్పుచు, ఒక్కొక్క భీమాపట్టాదారు తనకు కావలసిన సౌకర్యములను గూర్చి కంపెనీలవారికి తెలియబర్చినప్పుడు, వారు వానిని వినిపించుకొనక నిర్లక్ష్యభావముతో నుండుట అరుదు కాదనియు, ఒక పట్టాదారు తనకు కావలసిన సౌకర్యములనుగూర్చి తాను ఒంటరిగా కంపెనీలవారికి తెలియ బరచుటకంటె, సంఘీభావముతో పట్టాదార్లందరును ఒక్కచో సమావేశమై తమ అభిప్రాయములను, తమకు కావలసిన సౌకర్యములను ఏకగ్రీవముగా కంపెనీలవారికి తెలుపుట చాల ముఖ్య అవసరమనియు, అట్లు తెలుపుటకుగాను యిట్టి మహాసభలు జరుపుట అత్యంతావశ్యకమనియు చెప్పియుండిరి.

### శ్రీ వేమవరపు రామదాసు పంతులుగారి అధ్యక్షోపన్యాసములోని ముఖ్య సారాంశములు.

శ్రీయుత వేమవరపు రామదాసు పంతులుగారుపన్యసించుచు, హిందూదేశపు భీమాచట్ట సవరణకు గవర్నమెంటువారు, పట్టాదార్ల ప్రాతినిధ్యము లేనటువంటి ఎక్సుపర్టు కమిటీ (Expert Committee) యను నొక సంఘమును నియమించి యుండిరనియు, అట్టి ఎక్సుపర్టు కమిటీలో, పట్టాదారుల క్షేమాభివృద్ధుల కొరకు, పట్టాదారుల ప్రతినిధి యొకడుండుట అత్యంతావశ్యకమనియు హిందూదేశములో విదేశ భీమావ్యాపారమును ప్రోత్సాహింపరాదనియు, యేకారణముచేతనైన విదేశ భీమా వ్యాపారము సాగుచుండుసెడల, ఆ యీ విదేశ భీమాకంపెనీలవారు హిందూదేశపు జీవితభీమా వ్యాపారపు జమాఖర్చులెక్కలను ప్రత్యేకముగా వేయుచుండు ఏర్పాటుండవలెననియు, విదేశ భీమాకంపెనీలకు హిందూదేశములో వచ్చు రెవిన్యూలను యీ దేశములో జరుగు వర్తక భీమావ్యాపారములమీద గాని, లేక తదితర వ్యాపారములమీదగాని, యిక్కడనే పెట్టుబళ్ళుగా వినియోగించునటుల తగు జాగ్రత తీసుకొనవలసినదిగా గవర్నమెంటువారిని కోరుట అత్యంతావశ్యకమనియు నుడివియుండిరి.

శ్రీ పంతులుగారు పట్టాదారుల క్షేమాభివృద్ధులను గురించి చెప్పుచు యింతవరకు కంపెనీల వాటాదార్లు, ఆయా కంపెనీల వ్యాపారము మీద వచ్చు లాభములను ఎటులపంచుకొనవలసినదియు హిందూదేశపు భీమాచట్టమునందు నిర్ణయింపబడి యుండలేదనియు, కంపెనీలు యిచ్చు రివిజనరీ బోనసును, పట్టాదారులకన్న కంపెనీల వాటాదారులే యెక్కువ అనుభవించుచున్నారనియు, అట్టి లాభములను పంచుకొనుటకు పట్టాదారుడు తన పట్టా పండునంతవరకు వేచియుండవలెననియు, కంపెనీల వాటాదారులట్లుగాక, ఏయేటికాయేడు లాభములను పంచుకొనుచుండిరనియు, వాటాదార్లకు అట్టి లాభముల పంపకములను కొంతవరకు నిర్ణయించవలసిన ఆవశ్యకత గలదనియు జెప్పియుండిరి. పట్టాదారులు, కొన్నికంపెనీలిచ్చు యెక్కువ బోనస్సులకు ఆశపడక, కంపెనీయొక్క స్థిరత్వమును, పెట్టుబళ్లను, వ్యాపారాభివృద్ధిని చూచి, ఆకంపెనీయందు భీమాచేయుట, పట్టాదారునకు శ్రేయస్కరమని మొదలగు విషయమును చెప్పియుండిరి.

### ఈ మహాసభసందర్భమున గావింపబడిన ముఖ్యతీర్మానములు.

౧ వ తీర్మానము:—

పాలసీ హోల్డర్సు తరపున డైరెక్టర్ల స్థానమునకు ఎన్నుకొను సందర్భములో పట్టాదార్లందరికి సమానమైన వోటుహక్కును ఉండుటకు గాను ఆవోటుహక్కును తపాలాద్వారా exercise చేయుటకు అధికారముండునట్లు అవకాశము గలుగచేయవలెనని, కంపెనీలు ఈ విషయము అమలులోనికి తేవలెనని యీసభవారు తీర్మానించియున్నారు. ఈతీర్మానము చాల సమంజసముగా నున్నది. పట్టాదార్ల క్షేమాభివృద్ధులకు కంపెనీల పాలకవర్గములో పట్టాదార్ల ప్రతినిధులుండుట చాల ముఖ్యఅవసరము. అట్టి ప్రతినిధులను ఎన్నుకొనుటకుగాను ప్రతి పట్టాదారుడు వోటింగుహక్కును గలిగియుండవలెను. ఆవోటును exercise చేయుటకు తానేకారణముచేతనైనను తానున్న ప్రదేశమునుండి కంపెనీల ప్రధాన కార్యస్థాపనములకు రావీలులేకపోయిన, తనవోటును తపాలాద్వారా exercise చేయుటకు అవకాశము గలిగి యుండవలెను. ప్రతిపట్టాదారుడు కంపెనీల ప్రధాన కార్యాలయములకు రాలేకపోవచ్చును. అట్టివారు తమ తమ వోట్లను తపాలాద్వారా తమ ప్రతినిధికి అందజేయుటకు అవకాశము గలుగ జేయవలసినదిగా కంపెనీల వారిని గోరుట అత్యంతావశ్యకము. కంపెనీలవారు యీవిషయమై ఆలోచించి త్వరలోనే అమలులోనికి దెత్తురని నమ్ముచున్నాము.

4 వ తీర్మానము:—రాబోవు ఇన్సూరెన్సు చట్టసవరణలో పాలసీహోల్డర్ల హక్కులను కాపాడుటకుగాను యీసమావేశము వారు శ్రీయుత వేమవరపు రామదాసు పంతులుగారిని ప్రతినిధిగా ఎన్నుకొనుటకును, వీరినే గవర్నమెంటు వారు నియమించు Expert కమిటీలో సభ్యులుగా నియమించవలసినదిగా ప్రభుత్వమువారిని యీ సభవారు కోరుచూ తీర్మానించియున్నారు. ఈ తీర్మానమెంతయు సహేతుకముగను సమంజసముగను యున్నది శ్రీయుత వేమవరపు రామదాసు పంతులుగారు దేశసేవాప్రియులు; అనుభవశాలురు. సహకారోద్యమమునందు గొప్ప పేరుప్రతిష్ఠలను గన్నవారు. ఇంగ్లాండులో జరిగిన ఇంటర్నేషనల్ కోఆపరేటర్సు కాన్ఫరెన్సుకు హిందూదేశపు ప్రతినిధిగా వెళ్లియుండిరి. సౌత్ ఇండియా కోఆపరేటివ్ ఇన్సూరెన్సు సొసైటీ లిమి

డెడు స్థాపకులు ఇట్టిమహాసభయును, గవర్నమెంటువారు నియమించినExpertకమిటీలో మెంబరుగా యెన్నుకొనుటకును రాబోవు ఇన్సూరెన్సు చట్టసవరణలో పాలసీదార్ల హక్కులను గాపాడుటకుగానుపట్టాదార్ల ప్రతినిధిగా యెన్నుకొనుటయందును యీ మహాసభవారు చూపిన బుద్ధికుశలత గమంగదు ప్రశంసనీయము. ఈ మహాసభవారు కోరిన ప్రకారము చేయుటకు గవర్నమెంటువారు తగుఏర్పాట్లను త్వరలోనే చేయుదురని నమ్ముచున్నాము.

5 వ తీర్మానము:—

ఇన్సూరెన్సు కంపెనీలయొక్క సవరణ చేయుటలో షేరుహోల్డర్లు పెట్టుబడిమీద నూటికి సాలుకు 12 రు మించి డివిడెండు యివ్వకూడదని శాసించవలెనని ప్రభుత్వమువారిని యీ సభవారు కోరుచున్నారు. ఈ తీర్మానము ముఖ్యముగా గమనింపవలసిన తీర్మానము. ఇంతవరకు కంపెనీలవాటాదార్లు, ఆయాకంపెనీల వ్యాపారముమీద వచ్చు లాభములను ఎటుల పంచుకొనవలసినదియు, హిందూ దేశపు భీమాచట్టమునందు నిర్ణయింపబడియుండ లేదు. ఇవి వీలుగ తీసుకుని కంపెనీల వాటాదార్లు తమ యిష్టము వచ్చిన రీతిని లాభములను పంచుకొనుచున్నారు. కంపెనీలిచ్చు రివిజనరీ బోనసు పట్టాదారులకన్న కంపెనీల వాటాదారులే యెక్కువ అనుభవించుచున్నారు. అదిగాక కంపెనీలిచ్చు లాభములను పంచుకొనుటకు పట్టాదారుకు తన పట్టా పండునంతవరకు వేచియుండవలెను. వాటాదారు లట్లుగాక ఏయేటి కాయేడు లాభములను పంచుకొనుచున్నారు. గనుక వాటాదార్లకు అట్టి లాభముల పంపకములను కొంతవరకు నిర్ణయించవలసిన ఆవశ్యకతగలదు. ప్రభుత్వమువారు యీ సంగతిని గమనించి, రాబోవు ఇన్సూరెన్సుచట్టసవరణలో యీ మహాసభవారు కోరిన ప్రకారము కంపెనీల వాటాదారులు, సాలీనా నూటికి రు 12 లకు మించకుండా లాభములను పంచుకొనురీతిని శాసించెదరని నమ్ముచున్నాము.

---

[192 వ పేజీ తరువాయి]

క్రొత్తజీవితభీమాకంపెనీ:—

హిందూ దేశపు ప్రావిడెంటు కంపెనీలన్నిటిలోనికి గొప్పదగు ఏషియా మూచుఅల్ ఇన్సూరెన్సు కంపెనీ లిమిటెడు, ఆఫ్ కలకత్తా హిందూ దేశపు భీమాచట్టము ననుసరించి గవర్నమెంటువారికి రు 25,000 లను ధరావతు గట్టి హాయర్ లైఫ్ ఇన్సూరెన్సు వ్యాపారమును చేయప్రారంభించినదని తెలుపుటకు మేమెంతయు సంతసిల్లుచున్నాము.

* * * *

బెంగుళూరువులెన్, కాటన్ అండ్ సిల్క్ మిల్సు డైరెక్టరును, మైసూరుపేపరుమిల్సు డైరెక్టరును, బెంగుళూరుబ్యాంకు డైరెక్టరును, మైసూరు లెజిస్లేటివు ఎసంబ్లీ, లెజిస్లేటివు కౌన్సిలు మెంబరును అగు శ్రీయుత కాప్టెన్, రావుసాహెబు ఎ. తంగవేలు మొదలియారుగారు ఏషియాటిక్ గవర్నమెంటు సెక్యూరిటీలైఫ్ ఇన్సూరెన్సు కంపెనీ లిమిటెడుయొక్క జనరల్ బోర్డు ఆఫ్ డైరెక్టర్లలో ఒకరుగా జేరియుండిరని తెలుపుటను మేమెంతయు సంతసిల్లు చున్నాము.




### దక్షిణాఫ్రికాలో అగ్నిప్రమాదములు.

జూన్ జూలై నెలలలో దక్షిణ ఆఫ్రికాలో సంభవించిన అగ్నిప్రమాదముల విలువ మొత్తము 19,454 పౌనులకు మించియున్నదని "పాలసీ" అను పత్రిక తెలుపుచున్నది. 1935 సం॥ లో సంభవించిన పోర్టు ఎలిజబెత్ అగ్నిప్రమాదము వల్ల 32,327 పౌనులు నష్టమయ్యెను కేప్ ప్రావిన్సులో 5070 పౌనులున్నూ, ట్రాన్సువాలులో 9028 పౌనులు విలువగల ఆస్తులు అగ్నిప్రమాదమువల్ల నష్టపడెను. యూనియను బయట 4,520 పౌనులనుండి 468 పౌనులకు తగ్గియుండెను.

### 1935 సం॥ లోని రోడ్డు ప్రమాదములు:—

రోడ్ల ప్రమాదముల రిపోర్టునుబట్టి చూడ, యింగ్లాండులో 1935 సం॥లో జరిగిన ప్రమాదములు యీక్రింద నుదహరింపబడిన రీతిగనున్నవి. షుమారు 6500 మంది జనము మరణించిరి. 6,300 మందికి గాయములు తగిలెను. నూటికి 60 ప్రమాదములు మామూలురోడ్లమీద జరిగినవి. ఆదివారమునాడు తక్కువగను, అన్ని రోజులకన్న శనివారమునాడు విపరీతముగను యున్నవి. రోడ్లక్రాసింగులలో నూటికి 30 ప్రమాదములు జరుగుచున్నవి. 21 సం॥ పైన 30 సం॥ ములలోపల వయస్సుగల వారి ప్రమాదముల సంఖ్య 3,002 కు మించియున్నది. మోటారు డ్రైవర్ల వల్ల 1996 ప్రమాదములునూ, సైకిళ్లు తొక్కువారివల్ల 1038 ప్రమాదములునూ, కాలినడకమీద పోవువారి అజాగ్రత్త వల్ల 2562 ప్రమాదములునూ, తదితర జనము వల్ల 89 ప్రమాదములునూ, బండ్లు వగైరాల వల్ల 235 ప్రమాదములునూ, రోడ్ల పరిస్థితి బాగుగ లేకుండుటచే 44 ప్రమాదములును, తదితర కారణములచే 173 ప్రమాదములును, ఏకారణముచేత సంభవించినది తెలియనటువంటివి 152 ప్రమాదములునూ, వాతావరణస్థితి బాగుండక పోవుటచే 56 ప్రమాదములునూ, పశుజాతివల్ల 84 ప్రమాదములునూ జరిగియున్నవి.

* * * *

న్యూఇండియా అస్యూరెన్సు కంపెనీ లిమిటెడ్, లాహోరు బ్రాంచి ఆఫీసు మేనేజరుగారగు శ్రీయుత పి. డి. కోషలాగారు, తమ పదవికి రాజీనామాను యిచ్చినందున వారి స్థానే శ్రీయుత టి. పి. లాల్‌వానీగారిని బ్రాంచి మేనేజరుగా నియమించియున్నారు.

* * * *

లాహోరు లక్ష్మి ఇన్సూరెన్సు కంపెనీయొక్క అసిస్టాంటు మేనేజరుగారగు శ్రీయుత బి. యం. గుహాగారు కొద్దికాలముక్రిందట మరణించిరని తెలుపుటకు చాల విచారించుచున్నాము. వీరి యాకస్మిక మరణమువలన లక్ష్మి ఇన్సూరెన్సు కంపెనీవారికి తీరని కొరత వాటిల్లినది. వారి ఆత్మకు భగవంతుడు శాంతినొసంగుగాత!

* * * *

న్యూఇండియా అస్యూరెన్సు కంపెనీ లిమిటెడు, డైరెక్టరగు శ్రీయుత జె. డి. ఘాందీగారు బొంబాయినగరములో 1936 సం॥ ఆగస్టు 3 వ తారీఖున మరణించిరని తెలుపుటకు మేమెంతయు చింతిల్లుచున్నాము.

* * * *

# THE NORTHERN INDIA INSURANCE COMPANY, LIMITED, LAHORE.

PATRON :— His Highness, Raja SIR JOGINDER SEN BAHADUR, K. C. S. I. Ruler of Mandi State.

THE ONLY ACCIDENT
LIFE INSURANCE
COMPANY IN INDIA

| | | |
|---|---|---|
| Natural Death | Rs. | 5,000 |
| Any accidental | „ | 10,000 |
| Certain accidental death | „ | 15,000 |




The First Quadrennial Valuation discloses a handsome Bonus.

The Fifth Annual Report is ready for distribution and will be sent to anyone interested.

**Wanted Agents to represent the Company in all important places throughout S. India.**

PARTICULARS FROM :

M/S. K. R. CHARI & Co.
Chief Agents,
The Nizam's Dominions & Berars,
Sultan Bazaar,
HYDERABAD, Deccan.

NIRIKHI HANUMANTH RAO & BROS.
Chief Agents for
Ceded Districts,
FORT, KURNOOL, Kurnool Dt.

THE BRANCH SECRETARY
The Northern India
Insurance Company, Limited,
104, Big Street,
Triplicane, MADRAS.

---

# Sreemad Bhagavatam

## IN A NUTSHELL

AN

All-India Sanskrit-English Library Edition
with attractive tricoloured blocks

OF

## NARAYANEEYAM

Or Sreemad Bhagavatam in brief, a great literary asset with the impress of erudite scholarship and inspiring devotion of a great scholar and saint, the author now published for the first time with an English translation into quarterly Volumes @ Rs. 3 each. Postage Extra or Rs. 12 for the complete set. Postage Free Subscribed for by several Universities, Colleges and High Schools besides several Maharajas and other eminent men.

*Apply Sharp to:—*

P. N. MENON, B.A., B.L.,
*—Editor*

INSURANCE, PALGHAT.

---

నవీనపద్ధతి! ప్రత్యక్ష నిదర్శనం!

## అత్యద్భుత జాతక ఫలితములు.

మహారాజులు, నవాబులు, కలెక్టర్లు, జమీందార్లు, దొరలు దొరసానులు బహుమతులు, యోగ్యతాపత్రము లొసంగినారు. కళత్రసంతానభావములు, స్త్రీ జాతకములలో విశేషానుభవము గలదు. జననకాలం, తిధి, వారం, నక్షత్రం, జనన స్థలం వ్రాసి పంపవలెను.

ఒక సం॥నకు విదశాఫలములు, రెండు సం॥
ముఖ్యాంశము, స్వభావము రు. 2-0-0
ఒకదశకు భుక్తిఫలములు 6-0-0

జాతకం లేనివారికి సాంఖ్యశాస్త్రప్రకారమున్ను, రేఖాశాస్త్ర ప్రకారమున్ను వ్రాయుటకు ఒక సం॥ ఫలితములు, స్వభావము,
ముఖ్యాంశములు. రు. 3-0-0.

12 సంఖ్యలు, హస్తముద్ర నకలు, పూర్తి నామము వ్రాసిపంపవలెను. (పోస్టేజి ప్రత్యేకం.)

జ్యోతిషవిద్వాన్ ఇవటూరి షణ్ముఖరావు.
మారిస్‌పేట, తెనాలి, గుంటూరు జిల్లా.

# The First Conference of the Representatives of the Oriental Government Security Life Assurance Co., Ltd.,

## OF ANDHRA DESA

The representatives of "Oriental Government Security Life Assurance Company, Ltd," in Andhra Districts met in the Lawyer's Building in Guntur at 9 A. M, to-day the 5th instant. The meeting was well attended. Mr. A. V. Raghava Rao, B A., Representative, Rajahmundry, presided. Besides passing the following resolutions unanimously, a working committee was constituted with the president of this conference as president, Mr. T. V. Subba Rao, D. Com., Representative, Guntur, as General-Secretary, & Mr. M. Ramarao as Joint Secretary.

1. Resolved to form a permanent Association of our agents in Andhra Desa, and a sub-committee, to draft a constitution and to carry out all the formalities in getting the Association registered under the Trade Union Act, with the object of bringing forth a harmonious co-operation of all our field workers among ourselves, in promoting the interests of the company to the mutual advantage.

2. This conference requests the kind patronage of our esteemed Chairman, Sir Purushothamadas Thakurdas, Kt., C. I. E. M. B. E., J. P., Mr. H. Edwin Jones, F. F. A., A. I. A., Manager, and Mr. P. H. Gupta, Bar-at-Law., Branch Secretary.

3. (a) This conference appreciates the growing national feeling among the public to patronize the Indian Insurance Companies, and requests the agents to advocate in favour of Indian Insurance Companies alone.

(b) This conference draws the immediate attention of all the Indian Life Offices with regard to offering of policies at European Rates by some of the Non-Indian companies operating in India and requests the companies to take such steps as are required to prevent such competition.

4. This conference urges the pressing necessity of settling commission bills to all representatives every month, instead of quarterly as prescribed by the company.

5. This conference strongly protests the prevelance of the pernicious habit of offering rebates of commission by some of the insurance agents and appeals to the public and the agents to discourage such evils.

6. This conference is of opinion that the appointment of representatives irrespective of number is not conducive to the best interests of the company as well as to the existing representatives and therefore, requests the company to restrict the future appointments.

7. This conference pays a glowing tribute to our veteran agent Mr. Venkobarao of Ceded Districts for his meritorious services to the company.

8. This conference requests that the company should recognize the merits of the representatives and take them into the staff and executive annually, and also whenever vacancies arise.

9. This conference requests all the representatives of this company in

Andhra Desa to contribute Rs. 2 annually for the successful running of these conferences, and the Association.

10. This conference appreciates the good services rendered by Telugu Insurance Journals, "Bheema Patrika," "Bheema Pracharini," etc., and requests all the agents to patronize and encourage them.

WORKING COMMITTEE.

*President*:

Mr. A. V. Raghava Rao, B.A., Rajahmundry.

*General Secretary*:

Mr. T V. Subba Rao, D. Com., Guntur.

*Joint Secretary*:

Mr. M. Rama Rao, Guntur.

*Members*:

1. Mr. L. Suryanarayana, Avanigadda.
2. „ G. Subba Rao, Masulipatam.
3. „ V. Ramakotayya, B.A, L.L B., Bezwada.
4. „ D. Sitapathi Rao, Nellore.
5. „ P. Jagannadha Rao, Cocanada.
6. „ M. Butchi Raju, Guntur.

The Quorum has been fixed at three members.

# News

## Phiroz P. Ginwalla,

F. C. I. I., A. I. S. A. (LONDON).

This year Mr. Ginwalla is the only successful candidate to qualify for the F. C. I. I. Diploma outside the British Isles. He comes from a family of cotton merchants in Broach but having lost his father early in childhood and the factories having been wound up, he took to commercial education. He left the Sydenham College after the intermediate stage for the Commercial Diploma of England. He passed the Corporation of Accountant final examination in 1930 and the Incorporated Secretaries examination in 1931. When Life Assurance specialisation was introduced, into Bombay Mr. Ginwalla was the first to join the Devar's College in the Life Section.

In February 1933, he joined the New India Assurance Co., Ltd., and left for higher studies to Europe in January 1935. When in London he had the opportunity to study the practice of Life Assurance in that country by working with the London Assurance Co. He returned to India in September and resumed his duties with the New India. We wish Mr. Ginwalla a glorious future.

* * * *

## Central Exchange Bank of India.

Inauguration of the Central Exchange Bank of India in London by Sir Sorabji Poachkhanwalla has been made complete and the Bank will start to operate from early September.

Sir Atul Chetterji, Sir Padmaji Ginwalla, Sir C. B. Sethna, Sir Sorabji Poachkhanwalla and two other British Directors have been made Directors of the Bank.

* * * *

## New Actuaries.

We extend our hearty congratulations to those gentlemen who have passed in the Institute of Actuaries Overseas Examination, 1936, and wish them a prosperous career.

BUY

# INDIAN INSURANCE

If you want
Full Cover
Every Facility
Absolute Security
You should insure with

# INDIAN COMPANIES

Let every pie
You pay
For Insurance
Increase your
National wealth.
This is only possible
If you buy or
Represent

# INDIAN INSURANCE

# ఏషియన్ అస్యూరెన్సుకంపెనీ

లిమిటెడ్., బొంబాయి.

స్థాపితము : 1910 సం॥

పాలిసీ ప్రీమియము
ఆదాయము ... రు 18 లక్షల 40 వేలు
భీమానిధి ... రు 43 లక్షలు
1935 సం॥ లో జరిగిన
క్రొత్తవ్యాపారము రు 76½ లక్షలు
అమలులోనున్న
వ్యాపారము ... రు 2 కోట్ల 52 లక్షలు
బోనసు సంవత్సరమునకు ...
వెయ్యి రూపాయల యెండోమెంటు
పాలసీపైన ... రు 15 లు
వెయ్యి రూపాయల యావజ్జీవిత
పాలసీపైన ... రు 20 లు

క్రమాభివృద్ధిగాంచుచున్న ఈ దేశీయ భీమా సంస్థలో మీ జీవితములు భీమా చేయుడు. మా ఏజంట్లకు అపూర్వసౌకర్యములు సమకూర్చబడినవి.

వివరములకు :-బ్రాంచి మేనేజరు, గుంటూరు, లేక మద్రాసు, విజయనగరము

# 1936-37

## మాయొక్క రాబోవు ఆస్తిఅప్పుల విలువమదింపు సంవత్సరం

గత బోనసు పంపకపు ఫలితములు

యావజ్జీవిత భీమాలపై సం॥ 1కి
**రు 1000 కి రు 20**



ఎండోమెంటు భీమాలపై సం॥ 1కి
**రు 1000 కి రు 23**

ఇప్పుడే చేరుడు.

## హిందూస్థాన్ కో-ఆపరేటివ్ యిన్స్యూరెన్సు సొసైటీ లిమిటెడ్

మద్రాసు బ్రాంచి :
హిందూస్థాన్ బిల్డింగ్సు
107 ఆర్మీనియన్‌వీధి,
జి. టి. మద్రాసు.

సబ్ ఆఫీసులు :
విశాఖపట్నం, బెజవాడ, బళ్లారి,
బెంగుళూరు, కాలికట్, కోయంబుత్తూరు,
కడలూరు, మధుర.

Reg. No. M. 2749.



Printed and Published by the Editor at the Andhra Grandhalaya Press, Bezwada.